

ధారావాహిక ప్రారంభం....

# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

**కలౌ వేంకటనాయకః**

**శ్రీ వేంకటాచలపతి కలియుగంలో సమస్తప్రపంచాన్నీ నిర్వహించేదక్షతను, బాధ్యతను స్వీకరించినస్వరూపం. శ్రీ వేంకటేశ్వరవైభవం సామాన్యమైనవిషయం కాదు. ఆయన పేరే వేంకటేశ్వరుడు.**

**మిగిలిన అవతారాలకూ వేంకటేశ్వర అవతారానికీ ఒక ప్రధానమైనభేదం ఉంది. మిగిలిన అవతారాలలో ఆయనకు రకరకాలైనపేర్లు వచ్చాయి. మత్స్య, కూర్మ, వామన, నృసింహ, కృష్ణ, రామావతారాలు ఎన్ని వచ్చినా, ఆయా అవతారాలలో స్వామి తన గుణాలను ఆవిష్కరించడంచేత ఒక ప్రత్యేకమైన నామంతో పిలువబడ్డాడు.**

**కలియుగంలో పిలువబడే పేరు వేంకటేశ్వరుడు. ఆయన తీసుకునేదికూడా తలవెంట్రుకలు. చాలా చిత్రమైనవిశేషం. వేంకటేశ్వరుడు అనే పేరులోనే ఉంది-రహస్యమంతా. కలియుగంలో ఎవరికీ భగవంతునిచరణారవిందాలలో మనసు నిలబడదు. కలిప్రభావంచేత చిత్తంచంచలమై తిరుగుతుంటుంది.**

శంకరులు శివానందలహరిలో -

**సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ**
**నట త్యాశాశాఖా స్వటతి ఝుటితి స్వైర మభితః**
**కపాలిన్! భిక్షో! మే హృదయకపి మత్యంతచపలం**
**దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో?॥**

**(20వ, శ్లోకం)**

శ్రీకాళహస్తీశ్వరశతకంలో ధూర్జటి -

**తమకం బొప్పఁ బరాంగనాజనపరద్రవ్యంబులన్ మ్రుచ్చిలం**
**గ మహోద్యోగము సేయు నెమ్మనముదొంగం బట్టి వైరాగ్య పా,**
**శములం జుట్టి బిగించి నీదు చరణస్తంభంబునం గట్టివై**
**చి ముదం బెప్పడుఁ గల్గజేయఁ గదవే శ్రీకాళహస్తీశ్వరా!**

**(74వ పద్యం)**

మనసును నిగ్రహించడం అంత తేలిక కాదు. మనసుచేత అనేకపాపాలు చేస్తుంటాము. ఈ పాపాలు చేసేవారిని ఉద్ధరించడంకోసమని పరమాత్మ శ్రీ వేంకటేశ్వరుడిగా వచ్చారు. 'వేం' అంటే పాపం, 'కట' అంటే తొలగించేవాడు. మన పాపం ప్రతిబంధకంగా వచ్చి, పరమేశ్వరుణ్ణి చేరకుండా అడ్డగిస్తుంది. సాక్షాత్తుగా పరబ్రహ్మకే పాపాన్ని తొలగించగల శక్తి ఉంది. పాపం తొలగించగల ఈశ్వరుడై అంటే నియామకుడై సర్వజగత్తును కాపాడే ధారకుడు, పోషకుడు, శాసించగలిగినవాడై సాక్షాత్తుగా వైకుంఠం నుండి శ్రీ మహావిష్ణువు కదలి వచ్చినక్షేత్రం వేంకటాచలక్షేత్రం. అన్నమాచార్యులవారు వేదాలే పర్వతాలుగా వెలసినది తిరుమల కొండ అంటారు. బ్రహ్మాండపురాణంలోనూ, వరాహపురాణంలోనూ వేంకటాచలప్రశస్తి అని ప్రత్యేకంగా వర్ణించారు. ఒక్కొక్క యుగంలో-ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క మూర్తిగా స్వామి జగద్రక్షణ చేస్తూ వచ్చారు.

**కృతే తు నారసింహోऽ భూత్**
**త్రేతాయాం రఘునందనః**
**ద్వాపరే వాసుదేవ శ్చ**
**కలౌ వేంకటనాయకః**

ప్రధానమైనమూర్తులు-కృతయుగంలో నారసింహుడుగా జగత్తును రక్షించాడు.

శ్రీమద్రామాయణరచన ప్రారంభించే ముందే వాల్మీకి అడుగుతారు. ఆయన ప్రశ్నకు జవాబుగా పదహారుగుణాలూ పరిపూర్ణంగా ఉన్న అవతారం రామావతారమని నారదమహర్షి ప్రవచించారు. పదహారుగుణాలు కలిగిన రాముడు లోకాభిరాముడై, రావణాసురుణ్ణి నిగ్రహించాడు. రామావతారంలో చేసినంత రాక్షససంహారం ఏ ఇతర అవతారంలోనూ చెయ్యలేదు. కొన్నికోట్లమంది రాక్షసులను తెగటార్చాడు అని ఆయన బాలకాండలో చెప్పుకున్నారు. మిగిలిన అవతారాలకూ రామావతారానికీ తేడా ఒకటి ఉంటుంది. మిగిలిన అవతారాలలో స్వామి ఆవిర్భావం జరిగి, లోకాలను పీడిస్తున్న రాక్షసులను సంహరిస్తాడు. త్రేతాయుగంలో మానవులను కించపరచి మాట్లాడారు. రావణాసురుడు "మనుష్యులు నన్నేం చెయ్యగలరు"రని వరంలో మానవుల్ని కోరుకోవడం మానేశాడు. మనుష్యుల కీర్తిప్రతిష్ఠలు ఆవిష్కరించి, మానవత్వం గొప్పతనం చాటి చెప్పడానికి త్రేతాయుగంలో శ్రీరామచంద్రమూర్తి అయి రక్షించాడు. ఆయన ఏ అవతారంలో ఉన్నా ప్రక్కన శ్రీకారం ఉంటుంది. సంప్రదాయంలో వివాహమైన తరువాత పేరు ప్రక్కన శ్రీకారం ఉంటుంది. సంప్రదాయంలో వివాహమైన తరువాత పేరు ప్రక్కన శ్రీకారం లేకుండా వ్రాసుకోకూడదు. రాముడుకూడా శ్రీరాముడని పిలువబడ్డాడు. బాలకాండలో విశ్వామిత్రుడు ఇక్కడనుండి రాముణ్ణి లోకరక్షణకొరకు అప్పచెపుతున్నామని అంటాడు. ఎందువలన అనగా శక్తి ప్రక్కన చేరిన తరువాత శ్రీరాముడు పూర్ణత్వం పొందాడు. ఆయన లోకరక్షణార్థమని పదహారుగుణాలు కలిగిన సంపూర్ణమైన నరుడు ఎలా ప్రవర్తిస్తాడో అలా ప్రవర్తించాడు.

**కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ క శ్చ వీర్యవాన్ ।**
**ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥**

**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః**
**విద్వాన్ కః క స్సమర్థ శ్చ కశ్చైక ప్రియదర్శనః ॥**

**ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽ నసూయకః**
**కస్య బిభ్యతి దేవా శ్చ జాతరోషస్య సంయుగే ॥** (బాలకాండ 2-4)

**దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ**
**రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి ॥**

బాలకాండలో పదకొండువేల సంవత్సరాలు ఈ భూమిని పరిపాలిస్తా నని చెప్పారు. ఆయన పరిపాలిస్తే తప్ప మళ్లీ మనుష్యులు ఎలా ప్రవర్తించాలో తెలియనిరీతిలో రావణాసురుడు భూమండలాన్ని పాడుచేసేశాడు. అటువంటి భూమిని ఉద్ధరించి సత్క్రమమార్గంలో పెట్టడానికి అన్ని సంవత్సరాలు రాముడు రాజ్యం చెయ్యవలసివచ్చింది. అంత గొప్పది రామావతారం!




ద్వాపరయుగంలో పరిపూర్ణావతారమైన కృష్ణపరమాత్మగా వచ్చాడు. ఆ అవతారంలో తాను చేసిన దుష్టశిక్షణ కొంత అర్జునునివెనుక తాను ఉండి, అర్జునుడు చేసినట్లుగా-కనపడేటట్లుగా ప్రవర్తింపచేసి, నిగ్రహింప చేసిన రాక్షసులను కొన్నికోట్లమందిని, కురుక్షేత్రయుద్ధంలో ఎంతోమంది దానవులను, కండకావరంతో భగవంతుణ్ణి నిరసించినవారినీ సంహరించవలసి వచ్చింది. అటువంటి అవతారం - శ్రీకృష్ణావతారం.

కలియుగం వచ్చేసరికి ఆయన వేంకటనాయకుడుగా వచ్చారు. కలియుగంలో స్వామి దుష్టసంహారం చెయ్యలేదు. కత్తి నందకాన్ని పట్టి చంపలేదు. ఆయనఅవతారానికి చిత్రమైనస్థితి ఉంది. ఆయనదగ్గర ఉండే అన్నిరకాల ఆయుధాలు, ఆయన ధరించే విశేషమైన ఆభరణాలు ఒక్కొక్క అంశను పొందాయి. నందకం

అన్నమాచార్యుడుగా వచ్చింది. ఆయన దగ్గరుండే గంట వేదాంత దేశికులుగా వచ్చింది. ఒక్కొక్కటి అంశను పొంది, భక్తిని ప్రచారం చేశాయి. వేంకటేశ్వరస్వామి చాలాకాలం నోరు విప్పి మాట్లాడే వారు. తరువాతి కాలంలో తొండమాన్ చక్రవర్తిమీదకోపం వచ్చి, మాట్లాడనని భీష్మించారు. ఆ నాటినుండి మాట్లాడలేదు. ఇప్పటికీ ఆయన ఎవరికన్నా ఉపకారం చేసి రక్షించాలనిపిస్తే వేరొకరికి ప్రేరణ చేసి చేయిస్తుంటారు. ఆ కారణానికి వేంకటాచల క్షేత్రం పరమపావనమైన క్షేత్రం. అది సామాన్యమైనకొండ కాదు. ఆ కొండకూ, వేంకటేశ్వరునికీ గొప్పసంబంధం ఉంది. అది క్రీడాద్రి. శ్రీమహావిష్ణువు విహరించే పర్వతసానువు. ఆ క్రీడాద్రి భూమండలంమీదకి పర్వతంగా వచ్చింది. ఎప్పుడు వచ్చింది? కలియుగంలోనే వచ్చిందా? అంతకు ముందే ఉందా? అంటే అది కలియుగంలో వచ్చింది కాదు. కృతయుగంలో దానికి వృషాచల మనీ, తరువాతి కాలంలో దానికి అంజనాచలమనే పేర్లు ఉండేవి.

కలియుగం వచ్చిన తరువాత దానికి వేంకటాచలమని పేరు వచ్చింది. యుగాలు మారుతున్నా కొండ అలాగే ఉండి పోయింది. **"కృతే వృషాద్రిం వక్ష్యంతి, త్రేతాయాం అంజనా చలమ్।"** అని ఒక్కో యుగంలో ఒక్కో పేరుతో ఆ కొండ అలాగే ఉండిపోయింది. పేరుమాత్రం మారిపోయింది. ఇప్పటికీ వేంకటా చలంలో ఉన్న శిలాతోరణమెంత ప్రాచీనమో ఎవరూ చెప్పలేరు. చరిత్రకారులు కొన్నికోట్ల సంవత్సరాల క్రింద ఏర్పడిందని నిర్ధా రించారు.

వేంకటేశ్వరుడు రావడానికి మూడుప్రధానకారణాలు చెపు తారు. నారదమహర్షి వెళ్లి, వైకుంఠంలో ఉన్న శ్రీమహావిష్ణువును అడిగారు– "స్వామీ! నీవు స్థితికారుడవు. ఆ కలియుగంలో అల్పా యుర్దాయం కలిగిన అనేక పాపకృత్యాలు చేసి, అవి ప్రతిబంధకాలు కాగా, పరమేశ్వరుణ్ణి దర్శించలేక బాధపడుతున్నవాళ్లను ఉద్ధరించ డానికి నీవు చేసే ఉపకారమేమిటి?" అని ప్రార్థన చేస్తే– ఆ నాడు శ్రీమహావిష్ణువు అభయమిచ్చారు.

"కలియుగంలో నేను వేంకటేశ్వరుడుగా అవతరిస్తాను. కలియుగంలో అశ్వమేధాదియాగాలు నిషిద్ధం. యజ్ఞయాగాదులు చెయ్యలేరు. భూరిసంభావనలివ్వాలి. రామాయణం బాలకాండలో చెపుతారు– యజ్ఞం చెయ్యడం ఎలా ఉంటుందో! ఒక్కసారి వేంకటా చలం వెళ్లి, స్వామిని దర్శనం చేసినా, స్వామికి మనఃస్ఫూర్తిగా నమస్కరించినా, తలనీలాలు సమర్పించినా, చిన్నఆర్జితసేవ చేసినా వారిపాపరాశి దగ్ధమవుతుంది.

రెండవకారణం ద్వాపరయుగంలో శ్రీకృష్ణపరమాత్మగా ఉన్న ప్పుడు ఈ ప్రపంచంలో యశోదాదేవి పొందిన అదృష్టాన్ని ఏ తల్లీ పొంది ఉండదు. యశోదాదేవి అత్యంతప్రేమతో పెంచి పెద్ద చేసింది. కౌసల్య శ్రీమహావిష్ణువును రామచంద్రమూర్తిగా కన్నది. ఆమెకూడా సామాన్యమైన కష్టం పొందలేదు. దశరథమహారాజు అశ్వమేధయాగం చేశాడు. ఆ యాగంవల్ల పాపం ధ్వంసమవుతుంది. కొడుకు పుట్టకుండా అడ్డుపడుతున్న పాపం పోవడంకొరకు ముందు అశ్వమేధయాగం చేశాడు.

## పాపాలు పోవడానికి.....

మన పాపాలు మన కేశాలను ఆశ్ర యించి ఉంటాయి. ఆ పాపాలను మన నుంచి తీసి వెయ్యడంకొరకు కలియుగంలో ప్రతిదానికీ డబ్బుతోనే ముడి కనక ఎవరూ ఏమీ ఇవ్వలసిన అవసరం లేకుండా, మన ప్రమేయం లేకుండా, ప్రత్యేకించి పెంచాలనే అవసరం లేకుండా, తనంత తాను పెరిగేవి, భగవంతుని కృపాకరుణచేత ఉండే తల నీలాలు అడిగాడు.

ఆ కేశాల మొదళ్ళను ఆశ్రయించి, పాపాలు ఉంటాయి. వేంకటాచలం వెళ్లి, స్వామివారికి భక్తులు తలనీలాలు సమ ర్పించుకున్నంతమాత్రం చేత శరీరానికి పట్టి ఉన్న పాపరాశి తొలగిపోతుంది.

అందుచేత
వేంకటాచలక్షేత్రానికి ఆ ప్రాశస్త్యం ఉంది.

పుత్రకామేష్టిచేత ప్రీతి చెందిన దేవతలు పాయసపాత్రలో ప్రసాదమిస్తే – ఆ అనుగ్రహంచేత రామచంద్రమూర్తి పెద్దకుమారుడుగా జన్మించాడు. అంత కష్టపడితే వచ్చింది – రామావతారం. కౌసల్య రామచంద్రమూర్తితో చిన్నతనంలో ఆటలాడుకుని ఆనందాన్ని అనుభవించినట్లుగా రామాయణంలో చెప్పలేదు. రాముడు పుట్టాడు, పెరిగాడు అంతే!

కృష్ణపరమాత్మ బాల్యక్రీడలు సామాన్యమైనవి కావు. చదువుతుంటే మనసు పరవశించిపోతుంది. వ్యాసభగవానుడు సంస్కృతంలో ఒక ఎత్తున అనుభవిస్తే – ఆంధ్రీకరించిన పోతనగారు పరవశించిపోయారు. యశోద అడగకుండా రెండు మూడు సార్లు విశ్వరూపదర్శనం చేసింది. యశోద పొందిన ఆనందం పోతనగారిపద్యాలు చదువుతుంటే కలుగుతుంది.

మన్నేటికి భక్షించెదు?
మన్నియమము లేల నీవు మన్నింపవు? మీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా! మన్నేల? మఱి పదార్థము లేదే?

(దశమస్కంధం పూర్వభాగం - 336)



"మన్ను తినవద్దని చెపుతున్నా తింటున్నావు. బలరాముడు చెప్పాడు. ఎందుకు తిన్నా?"వని అమ్మ వేలు చూపించి అడిగితే, అమ్మచెయ్యి పట్టుకుని ఎంతో టక్కరితనంతో,

అమ్మా! మన్ను దినంగ నే శిశువనో? ఆకొంటినో? వెఱ్ఱి నో?
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్, నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్య గం
ధ మ్మాఘ్రాణము సేసి, నా వచనముల్ దప్పైన దండింపవే!

(10- పూ.భా.338)

"వట్టిదమ్మా, నీతో కొట్టించడానికి వీళ్లు ఇలాంటి మాటలు చెపుతున్నారు. మట్టి తింటే నా నోరు మట్టివాసన వస్తుంది కదా! నా నోరు వాసన చూడు"– అంటే, యశోద నోరు తెరు అన్నది. నోరు తెరిస్తే,

ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండ మైన బ్రహ్మాండంబున్.

(10-పూ.భా.340)

"ఏమిటి? పిల్లవాడినోటిలో సమస్తబ్రహ్మాండాలు!" అని ఆశ్చర్యపోయింది. అటువంటి అవతారం కృష్ణావతారం. కష్టపడి పెంచి పెద్ద చేసినా కొడుకుకల్యాణం చూడలేదు. ఆమె కోరుకున్నది కల్యాణం చూడాలని. అమ్మమాట కాదనలేని బలహీనత. ఏ తల్లి అవసరమూలేని పరమేశ్వరుడుకూడా పొంగిపోతాడు.

ఆయన "నేను వేంకటేశ్వరస్వామిగా అవతరించినప్పుడు నువ్వే దగ్గర ఉండి పెండ్లి చేద్దువుగాని" అని వరమిస్తాడు.

ఆ మాట నిలబెట్టుకోవడంకొరకు వకుళమాత చేతుల మీదుగా వివాహం చేసుకోవడానికి వేంకటేశ్వరావతారం వచ్చింది.

మూడవకారణం వేదవతిని పరిగ్రహించాలి. పూర్వం కుశధ్వజుడనే మహర్షి వేదోపాసనచేస్తూ – యజ్ఞయాగాది క్రతువులు చేస్తూ– ప్రక్కన దర్భలు పెట్టి, అంతర్ముఖుడై సమాధి స్థితిలో ఉండగా, ఆయనపూర్వపుణ్యఫలం, ఉపాసనాబలంచేత ఆ దర్భలమీద ఒక చంటిపిల్ల ఆడుకుంటూ కనపడింది. కన్నులు తెరచి చూచి, దర్భలమీద పుట్టింది కనక 'వేదవతి' అని నామ ముంచి, పెంచి పెద్ద చేశారు.

యుక్తవయస్సు వచ్చిన తరువాత "నీకు వివాహం చేస్తా" నమ్మా అంటే, ఆమె "తండ్రీ! నేనెప్పుడూ శ్రీమహావిష్ణువుకే భార్యను" అంది. "వేదవెప్పుడూ ఆయనకు చెందిందే! ఆయన "శ్రీమహావిష్ణువును భర్తగా పొందటమంటే మాటలు కాదు, ఆ నాడు పార్వతీ దేవి హిమాలయాలలో తపస్సు చేసి, శివుణ్ణి భర్తగా పొందినట్లు– నీవు హిమవత్ ప్రాంతం చేరి తపస్సు చేసి శ్రీమహావిష్ణువుని భర్తగా పొందు" మని చెప్పాడు. ఆమె తపస్సు చేసుకోవడానికి వెళ్లింది. ఆమె వెళ్లి తపస్సు చేసుకుంటుండగా రావణాసురుడు వచ్చాడు. వచ్చి, ఆమెను బలవంతంగా గ్రహించే

ప్రయత్నం చేస్తుండగా "పరస్త్రీని బలవంతంగా చెరపట్టడం అనే నీ ప్రయత్నంచేతనే నీ వంశం నాశనమైపోవుగాక" అని శపించి, దావాగ్నిలో ఆమె శరీరం విడిచిపెట్టే ప్రయత్నం చేసింది.

ఆ సమయంలో అగ్నిహోత్రుడు ఆమె సాక్షాత్తు వేదవతి కనక, ఆమెను తీసుకుని వెళ్లి, తనభార్య అయిన స్వాహాదేవికి ఇచ్చి, కాపాడమని చెప్పాడు. కొంతకాలానికి రావణాసురుడు వచ్చి, సీతమ్మతల్లిని అపహరించి తీసుకునిపోతున్నాడు.

ఎదురుగా అగ్నిహోత్రుడు వచ్చాడు. వచ్చినవాడు సద్బ్రాహ్మణుడైన అగ్నిహోత్రుడని నమస్కరించకుండా వెళ్ళిపోతుంటే, వాడికి తగిన పరాభవం చెయ్యాలనుకున్నాడు- అగ్ని. "ఎంతపని చేసావు? దుందుడుకు తనంతో నన్ను మాటమాత్రం పలకరించ లేదు. ఔనులే! నీ రథంమీద ఉంది నిజమైన సీత అనుకుంటున్నావు. ఈవిడ మాయాసీత. రామునికి దూరశ్రవణవిద్య ఉంది. నీవు మారీచుడితో కలసి సీతమ్మను అపహరించాలనుకున్నది విని "అసలు సీతను తెచ్చి" నా దగ్గర పెట్టి, మాయాసీతను పర్ణశాలలో పెట్టాడు. నీవు మాయా సీతను పట్టుకుని వెళుతున్నావు"-అన్నాడు. "కోపంలో చెప్పినా చాలా గొప్పమాట చెప్పావు. అసలు సీతను తీసుకుని రమ్మ"ని అన్నాడు. అగ్నిహోత్రునివద్ద ఉన్న వేదవతిని తాను తీసుకుని వెళ్లి, అసలు సీతను అగ్నివద్ద వదలి వేశాడు. రావణాసురుని అశోకవనంలో 12 నెలలపాటు సీతమ్మతల్లి బదులుగా వేదవతి బందీకృత అయి ఉంది.

## వైకుంఠపాళి 03 - సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 తి | | 2 వ | ర | 3 వి | క్ర | 4 యం | | 5 ప |
| మ్మ | | నం | | రి | | హ | | ద్మ |
| 6 ర | జ | | 7 మ | తా | బు | | 8 సే | ద |
| సు | | 9 లం | | వి | | 10 ఢా | | ళం |
| | 11 కిం | కి | ణి | | 12 వా | కి | లి | |
| 13 వా | | ణి | | 14 ఏ | | ని | | 15 న |
| 16 యు | వ | | 17 ఆ | క | లి | | 18 బా | వ |
| లీ | | 19 చి | | వీ | | 20 కా | | నీ |
| నం | | 21 కాం | స్య | ర | వ | ళి | | తం |



రామచంద్రమూర్తి రావణాసురుణ్ణి సంహరించిన తరువాత అసలు సీతను తాను స్వీకరించడంకోసం మాయాసీతను అగ్ని ప్రవేశం చేయించాడు. వేదవతి అగ్నిహోత్రునివద్దకు వెళ్లిపోయింది. అందుకని అగ్నిపరీక్ష అనే నెపం జరిగింది. ఆనాడు అగ్నిహోత్రుడు ప్రార్థన చేసాడు. "నీ భార్యగా 12 నెలలు ఉంది కనుక పరిగ్రహించ"మని అన్నాడు. ఇద్దరూ ఉండటమనేది ఉండదు. రావణుడు వేదం చదివి ఘన, జట చెప్పుకునేవాడు. దానినే శ్రద్ధ అంటారు. తాను ఏం చెపుతున్నాడో దానిమీద విశ్వాసం ఉండాలి. రావణుడు వేదం చదువుకున్నాడు కానీ, వేదస్వరూపిణి అయిన సీతమ్మతల్లిని అపహరించి తెచ్చాడు. తాను ఏ కులదేవతారాధన చేస్తున్నాడో ఆ కులదేవతను అపహరించి తెచ్చానని అనుకోలేదు. అందుచేత రావణుడు శ్రద్ధలేకనే నశించిపోయాడు.

అగ్నిహోత్రునికోరికకు రాముడు "ఇది రామావతారం. ఏకపత్నీవ్రతం అందుకని స్వీకరించను. కానీ కలియుగంలో వేంకటేశ్వరుడుగా వచ్చినపుడు వేదవతి మళ్లీ అయోనిజ అయిన పద్మావతిగా ఆవిర్భవిస్తుంది. ఆనాడు పద్మావతిగా స్వీకరిస్తా"నని మాట ఇచ్చాడు. ఈ మూడుమాటలు నిలబడాలి. అందుకని వేంకటేశ్వరావతారం వచ్చింది.



# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

**తిరుమల క్షేత్రంలోని ఏడుకొండలే**
**వృషభాద్రి, వృషాద్రి, గరుడాద్రి, అంజనాద్రి, శేషాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి.**

ఆత్మస్వరూపమైన పరమాత్మే ఏడు కొండలమీది వేంకటేశ్వరుడు. నారములు అంటే జీవులు. వాటన్నిటికీ ఆధారభూత మైన స్వరూపమే నారాయణాద్రి మీద ఉండే వేంకటేశ్వరుడు.

ఏడుచక్రాలూ దాటితే - ఆనందా నుభూతి కలుగుతుంది. ఆనందనిలయం బ్రహ్మస్థానంలో ఉంటుంది. అక్కడ సహ స్రారమని వెయ్యి రేకులపద్మం ఉంటుంది. శ్రీవిద్యలో షట్ చక్రభేదనం చేస్తారు. మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం, అనాహతం,విశుద్ధి,ఆజ్ఞాచక్రం ఉంటాయి. షట్చక్ర భేదనం చేస్తే- సహస్రారంలో 'పరమశివపర్యంక నిలయాం' అని శివుని తొడమీద కూర్చున్న అమ్మవారి దర్శన మవుతుంది.

ఇట్టి సాధన చేసిన యోగినాడీ మండలం అమృతవృష్టిచేత తడిసి పోతుంది. అలా అనుభవించగలిగిన ఆనందస్వరూపమే పరమాత్మ. ఏడు కొండలమీదే ఆయన ఉంటాడు. ఏడు కొండలు ఎక్కడంలో ఒకరహస్యం ఉంది. ఆ ఏడుకొండలు సాలగ్రామాలు, అక్కడి చెట్టు, పుట్ట- పిట్ట, ఏదైనా సరే! అన్నీ - మహర్షుల అంశాలే! అన్నమాచార్యుల వారు చెప్పులు వదలిచూస్తే వారికి పర్వత దివ్యదర్శనమైంది. రామానుజాచార్యుల వారు కొండ అంతా సాలగ్రామ శిలలు కాబట్టి పాదాలతో కొండను తొక్కడం ఇష్టంలేక- పాదాలు, మడిచి, మోకాళ్ళను తాళ్ళతో కట్టుకుని, దేకుతూ పైకి ఎక్కారు.

**ఏడుకొండలలో మొదటిది వృషభాద్రి -** వృషభమంటే ఎద్దు. చూడడానికి ఆ కొండ ఒకఎద్దు ఉన్నట్లుగా ఉంటుంది. వృషభానికి ఋగ్వేదంలో ఒక సంకేతం ఉంది.

**చత్వారిశృంగా త్రయో అస్యపాదా ద్వే**
**శీర్షే సప్తహస్తాసో అస్య**
**త్రిధా బద్ధో వృషభో రోరవీతి**
**మహా దేవో మర్త్యాగ్ం ఆవివేశ ॥**

నాలుగు కొమ్ములుంటాయి. మూడుపాదాలుంటాయి. రెండుతలలు, ఏడుచేతులు, మూడుచోట్ల కట్టబడుతుంది. పరమశివుడు అటువంటి నందీశ్వరుని మీద కూర్చుని వస్తాడు. నిజానికి నందీ శ్వరుడలా ఉంటాడని కాదు. శబ్దానికి సంకేతం-నాలుగుకొమ్ములు అంటే 'పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ' అని మాట నాలుగురకాలుగా ఉంటుంది. నిర్వికల్ప సమాధిలో ఉంటే పరావాక్కు వినబడు తుంది. నిర్వికల్పసమాధిలో ఉంటే పశ్యంతీవాక్కు వినబడుతుంది. ఎవరికి వారికి లోపలే వినపడే వాక్కుకు మధ్యమా అని పేరు. పైకి వినపడే వాక్కుకు వైఖరి అని పేరు. మూడుపాదాలచేత నడు స్తుంది - అదే భూత, భవిష్య, వర్తమాన

కాలాలు. కార్యశబ్దం, కారణశబ్దమని రెండు తలలు. చేతులు ఇచ్చి పుచ్చుకోవడానికి- పదాలచేత వాక్యనిర్మాణానికి అను సంధానం చేస్తాయి. ఏడువిభక్తులచేత శబ్దం నిర్వహించబడు తుంది. వాక్కు హృదయంలో, నాభిలో, శిరస్సులో బంధించబడు తుంది. అటువంటివాక్కును అధిరోహించి, పరమాత్మ వస్తు న్నాడు.

వాక్కు అనగా శబ్దం. శబ్దం - అంటే వేదం. ఆ వేదమే ప్రమాణం. ఇతరాలు ప్రమాణం కావు. కంటితో చూచి చెపుతున్నవి, నిజం కానివి ఎన్నో ఉన్నాయి. ఉదయించడం, అస్తమించడం లేని సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ చూడటం కుదరదు. సూర్యునిచుట్టూ భూమి తిరగడంలో, తిరగని సూర్యునికి అభి ముఖంగా లేని ప్రాంతానికి చీకటి పడింది. తిరగని సూర్యునిలో చలనత్వాన్ని ఆరోపించి, తిరుగుతున్న భూమికి అచలత్వాన్ని ఆరోపిస్తున్నాము. పొగమంచును చూచి, పొగ అంటున్నారు. ఎర్రదనం చూచి, మంట అంటున్నారు. కన్ను భ్రాంతికి లోనైంది కదా! చూచిందల్లా కంటికి ప్రమాణమని అంటే కుదరదు. వేదప్రమాణాన్ని అంగీకరిస్తే మొదటికొండ ఎక్కుతారు.

**రెండవది వృషాద్రి-** వృషాద్రి అంటే ధర్మం. వేదంలో పూర్వభాగమంతా ధర్మంగురించి చెపుతుంది. మనం నిర్వర్తించ వలసిన విధికి ధర్మమని పేరు. వేదం కొన్నిధర్మాలు చెప్పి, వాటిని నిర్వర్తించమని చెప్పింది.

అవి చేస్తే ఇహంలో సుఖంగా ఉండి పరలోకంలో సుఖం పొందుతారు. అటువంటి కర్మలను, ధర్మాలను నిర్దే శించిన విషయాలను తెలుసుకుని, అనుష్ఠానం లోకి తీసుకుని రావడమే వృషభాద్రి. వృషాద్రి, వృషభాద్రి దాటితే **మూడవది గరుడాద్రి.**

గరుడుడు అనగా పక్షి. పక్షి ఆకాశంలో ఎగురుతుంది. ఎక్కడో ఆకాశంలో ఎగురుతున్న గద్ద- కింద ఎంతో జాగ్రత్తగా తిండి తింటూకూడా కోడి చూసుకుంటున్న కోడిపిల్ల, తల్లి రెక్కలనుంచి కించిత్తు దూరమైతే దానిమీద దృష్టి పెట్టి, అంత పైనుండీ వాయువేగంతో వచ్చి, తన రెండు కాళ్ళతో కోడిపిల్లను ఎత్తుకుని దూరంగా ఎగిరిపోతుంది. అటువంటి సమ్యక్ దృష్టితో ఉంటాడు-గరుడుడు.

అనగా ఉపనిషత్ జ్ఞానం పొందడం. 'షద్' అంటే జీర్ణం కానిది. జీర్ణం కాని దానిని 'ఉప' అనగా సమీపానికి తీసుకుని వెడుతుంది. ఒక్క పరబ్రహ్మం జీర్ణమవదు. మిగిలిన వాటన్నిటికీ ఆరువికారాలు ఉంటాయి. పుట్టింది, ఉంది, పెరిగింది, మార్పుచెందింది, తరిగింది, నశించిపోయింది. ఈ ఆరూ లేనివాడు కనకనే ఆయనకు ఇంకో పేరు లేదు- భగవన్ అనేదే ఆయన పేరు.

ఐశ్వర్య బలాలు, జ్ఞానశక్తి వీర్యతేజస్సులు ఉన్నవాడు- కల్యాణగుణ సహితుడు, హేయగుణరహితుడు కనక ఆయన భగవానుడు. ఆయనను జ్ఞానంచేత తెలుసుకోవడం గరుడాద్రి.

**నాలుగవది అంజనాద్రి-** అంజనమంటే కంటికాటుక. కంటికి అందంకొరకు, చలువ కలగడంకొరకు కాటుకపెట్టు కుంటారు. కంటితో చూడవలసిన వస్తువిశేషాలనుమాత్రమే చూడడం కాక, చూడబడే ప్రపంచమంతటికీ అధిష్ఠానమైన బ్రహ్మాన్ని చూడకలిగిన లోచూపు కలగడం కంటికి కాటుక. ఇన్ని రూపాలుగా కనపడుతున్నది ఇన్ని కాదు.

**అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః**

ఇదంతా కేవలం ఒక్క పరమాత్మ అని తెలుసుకోగలిగిన లోచూపు ఏర్పడితే, కంటికి అంజనం పెట్టుకున్నట్లు. **అంజనాద్రి ఎక్కి శేషాద్రికి వెడతారు.**

ప్రపంచమంతటినీ భగవన్మ యంగా చూచే స్థితి వస్తే, వారికి రాగద్వేషాలు, క్రోధం, శత్రుత్వం ఉండవు.

భగవద్గీతలో స్వామి అంటాడు-

**తుల్యనిందా స్తుతి ర్మౌని సంతుష్టో యేన కేన చిత్**
**అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః**

బ్రహ్మం తప్ప వేరొకటి లేదు అన్నవారికి భయం ఉండదు. తాను కాకుండా ఇంకొకటి ఉన్నదంటే దానివలన ఏదో ఉంటుందని భయం.



## భోజనం... ఉచితం!

**తిరుమలలో మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ అన్నదాన సత్రంలో భక్తులకు ఉచితభోజన సదుపాయం ఉంది.**

బ్రహ్మంగా నిలబడినవారికి బ్రహ్మంగా అవతలివారి భావన తెలస్తుంది. బ్రహ్మంతో తాదాత్మ్యం తెలుసుకున్నవాడు లోకం కష్టసుఖాలు తెలుసుకుంటాడు. శుకాదులు – ఈ బ్రహ్మ స్థితిని పొందినవాళ్లు.

**సర్వం బ్రహ్మమయం జగత్.**

అన్నిటిలోనూ బ్రహ్మమే. ఇంకోవస్తువు ఉండదు. ఒక్కటే వస్తువు.

**చిదానందరూప శ్శివోఽహం శివోఽహం**

ఎప్పుడూ ఒక్కలా ఉండగలిగినవాడు బ్రహ్మం. అటు వంటి స్థితిని పొందినవారు మహాపురుషులు. ఆ స్థితికి ఎదగ గలిగితే అంజనాద్రి చేరుకున్నట్లు. దాటితే **వేంకటాద్రి**. అంటే పాపాలు తొలగిపోతాయి. తాను చేస్తున్నదేదీ లేదు. అంతా బ్రహ్మమే చేస్తున్నాడు. బ్రహ్మమే చేయించుకుంటున్నాడు.

పూర్వకాలంలో ఒక సన్యాసి ఉండేవారు. ఆయనకు ఆకలి వేస్తే– ఏదో రోగం వచ్చినట్లుగా అనిపించేది. జ్ఞానం కలిగినవారు గనక ఆకలిని క్షుద్బాధ అని పిలుస్తారు. బాధ కలిగినప్పుడు లోపల పదార్థాన్ని పడవేస్తాడు. రుచి గురించి తాపత్రయపడడు.

ఒక మురికికుండీవద్ద కూర్చుని ఎవరో పారవేసిన పదార్థాన్ని కుక్కలు తింటుంటే, వాటితోపాటు పదార్థాలను చేతిలో పెట్టుకుని తింటున్నాడు. దోవన వెళుతూ చూచిన వాళ్ళు–ఆయనకు పెద్దసన్యాసి అని నమస్కరిస్తాం అనుకొని, దగ్గరకు వెళ్లి, ఆయన పారవేసిన అన్నాన్ని కుక్కలతో కలిసి తింటున్నాడని, వెళ్ళి "మీరు చేస్తున్న దేమిటి? మీరు చేస్తున్నది మీకు తెలుస్తున్నదా?" అని అడిగారు.

కుక్కల రూపంగా ఉన్న బ్రహ్మంతో బ్రహ్మం కలిసి అన్నం తింటున్నది ఈ శరీరం అనబడే బ్రహ్మం బ్రహ్మంగా నిలబడి బ్రహ్మంగా ఆనందం పొందుతున్నది" అన్నాడు.

ఆయన స్థితి మనకు అర్థం కాకపోతే ఏవో పిచ్చి మాట లను కుంటాము. లోకంలో బాగా జ్ఞానం పొందినవాళ్ళు పిచ్చి వాళ్ళలా కనపడతారు. జ్ఞాని, పిచ్చివాడు ఒకలా ఉంటారు. పరమశివునికి ఉన్మత్తశేఖరుడని అని పేరు. ఉన్మత్తుడు అంటే పిచ్చివాడని అర్థం. పిచ్చివాళ్ళల్లో శేఖరుడు అని పేరు. అంటే పరమశివుడు పిచ్చివాడని అర్థం కాదు. అంతటిజ్ఞాని అని అర్థం. ఆయన జ్ఞానగంగాధరుడు. అటువంటి స్థితిని పొందటం వేంకటాద్రి. వారికి పాపం పుణ్యాలుండవు.

**నారాయణాద్రి చివరిది.** అనగా తురీయ అవస్థను దాటి, తానే బ్రహ్మంగా నిలబడిపోతాడు. అటువంటి స్థితిని పొందటం నారాయణాద్రి. వేంకటాచలంలోని ఏడు కొండలు ఎక్కడం వెనకాల ఇంత రహస్యాన్ని చిత్రంగా నిక్షేపించారు. వేంకటాచలమనేసరికి మనకు జ్ఞాపకం వచ్చేది స్టేషనులోకి వెళ్ళి, రైలెక్కి వెళ్ళి, బస్సు ఎక్కి ఏడుకొండలు ఎక్కడం, కాటేజీలోకి వెళ్ళి స్నానం చేసి, ఆనందనిలయంలోకి వెళ్ళి, స్వామికి ఒక నమస్కారం చేసి బయటికి వచ్చేయడం.

*(ఇంకా ఉంది)*



**శ్రీ వేంకటేశ్వరస్వామితో ప్రతి రోజూ మాట్లాడి, ఆయనతో కలసి ఆనందాన్ని పంచుకున్న మహాపురుషులు ఇప్పటికీ ఏడుకొండల మీద ఉన్నారు. వారి గురించి చెప్పుకుంటే స్వామి చెవి ఒగ్గి వినేటంత పరమపవిత్రులు వాళ్లు.**




# తిరుమల విశిష్టత

– బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

## తిరుమల నంబి

వారిలో అగ్రగణ్యులు, మహానుభావులు శ్రీశైలపూర్ణులు అని మనం పిలిచే తిరుమలనంబి. సహస్రదీపాలంకారం చేసే దక్షిణపురోడ్డులో తిరుమలనంబి దేవాలయమని ఉంటుంది. అక్కడకు ఎవరో ఒకరిద్దరు తప్ప వెళ్ళి నమస్కరించరు. మాడ వీధులలో వేంకటేశ్వరస్వామి ఊరేగింపుగా వచ్చి తిరిగితే, మొదటగా ఆగి, నీరాజనం ఆ తిరుమలనంబి దేవాలయం దగ్గరే అందుకుంటారు.

ఆ తిరుమలనంబి ఎంతో గొప్పవారు. ప్రాచీనకాలంలో వేంకటేశ్వరస్వామికి అభిషేకానికి మడినీళ్ళు తెచ్చేవాళ్ళు లేని రోజులలో, గురువుగారి ఆదేశం అనుసరించి, నీళ్ళు తేవడానికి పాపవినాశనం దగ్గరకి చీకటిలో బ్రహ్మీముహూర్తంలో వెళ్ళి నీళ్ళు తెస్తుండేవారు. ఒక రోజు స్వామి ఆయనభక్తి పరీక్షించి, లోకానికి చాటి చెప్పాలనుకుని ఒక బోయవానిరూపంలో వచ్చి, "తాతా! దాహం వేస్తుంది నీళ్ళు ఇవ్వవా?" అని అడిగారు. "ఈ నీళ్ళు వేంకటేశ్వరస్వామికి అభిషేకానికి పట్టుకుని వెడుతున్నవి. నీకివ్వను" అన్నాడు. వేంకటేశ్వరస్వామి చేతిలో ఉన్న బాణాన్ని ఆ కుండకి వేశారు. కుండకి చిల్లుపడి నీళ్ళు పడుతుంటే స్వామి తాగేసాడు. కుండ ఖాళీ అయిపోయింది. ఏమిటి? కుండ తేలికైపోయింది అనుకుని వెనుకకి చూస్తే, పిల్లవాడు నీళ్ళు తాగుతున్నాడు. "ఎంత పని చేసావురా, శ్రీనివాసుని అభిషేకానికి తీసుకుని వెళుతున్న కుండకి కన్నం



పెట్టి నీళ్ళు తాగావా? అని నిందించబోయాడు. అప్పుడు ఆ పిల్లవాడు "తాతా బెంగపెట్టు కోకు. పాపవినాశనం కన్నా గొప్ప నీరు ఈ పక్కనే ఉంది. రా! చూపిస్తాను" అని కొండవాగులోకి తీసు కుని వెళ్ళి బాణప్రయోగం చేస్తే ఆకాశగంగ పుట్టింది. ఇక నుంచి ఈ నీటితో నాకు అభిషేకం చెయ్యి" అన్నాడు.

'నాకు అభిషేకం చెయ్యమని అంటాడేమిటి' అని తిరుమలనంబికి ఆశ్చర్యం వేసింది. ఆ పిల్లవాడిని తేరిపార చూసేసరికి అంతర్ధానమైపోయాడు. ఆ నాటి నుండి ఈనాటివరకు శుక్రవారం అభిషేకానికి ఆకాశగంగతీర్థాన్ని తీసుకుని వస్తారు. వేంకటేశ్వరస్వామిచేత "తాతా" అని పిలువబడ్డాడు కనక అక్కడ తిరుమల నంబికి మొదటిదేవాలయం. స్వామి మొదటిహారతిని మాడవీధులలో ప్రదక్షిణం చేసినప్పుడు పుచ్చుకుంటారు.

తిరుమలనంబి ఉదయం స్వామికి అభిషేకం చేసి కిందకి దిగి, – రామానుజాచార్యులు 14 సార్లు రామాయణం చెపితే ఒకమాటు చెప్పినపుడు చెప్పిన అర్థం ఇంకో మాటు చెప్పకుండా చెపుతుండేవారు. అది విని – మళ్ళీ కొండపైకి వెళుతుండేవారు. రెండుమార్లే స్వామిదర్శనమవుతున్నదని బెంగపెట్టుకున్నారు.

స్వామి తిరుమలనంబికి కలలో కనపడి నంబీ, బెంగపెట్టుకోకు. ప్రతిరోజూ మధ్యాహ్నంకూడా నీకు నా దర్శనం చెయ్యడానికి వీలుగా అలిపిరివద్ద నా పాదాలు ఉంచుతున్నానని చెప్పారు. అలిపిరివద్ద శ్రీవారిపాదుకలు తలమీద పెట్టు కుని ప్రదక్షిణం చేసే శ్రీవారిపాదాలని ఉండే పాదాలు తిరుమల నంబి గొప్పతనం, భక్తిచేత వచ్చాయి. అంత గొప్పవారు తిరుమలనంబి. *(ఇంకా ఉంది)*

శ్రీనివాసునికి తిరుమలనంబి కైంకర్యం అమోఘం. తిరుమల నంబి భక్తిసేవాతత్పత్తపరతను గుర్తించిన స్వామి శుక్రవారాభిషేకానికి ఆకాశ గంగను సృష్టించి, గైకొనడం స్వామి భక్తపరాయణతకు నిదర్శనం. ఇదే కోవలో పూజనీయురాలు, మహాభక్తురాలు తరిగొండ వేంగమాంబ. ఈనాటికీ రాత్రిపూట స్వామివారి పవళింపుసేవలో చివరగా వేంగమాంబ ముత్యాలహారతితో రోజువారి కైంకర్యం పూర్తవడం విశేషం.



# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

## తరిగొండ వేంగమాంబ

ఆ తర్వాత చెప్పుకోవలసినవారు తరిగొండ వేంగమాంబ. తిరుమలలో ఆమె సమాధి ఇప్పటికీ ఉంది. ఆ సంగతి చాలామందికి తెలీదు. తరిగొండ అన్న ఊళ్ళో కృష్ణయ్య, మంగమ్మ అనేదంపతులకి ఐదుగురు కొడుకులు కలిగారు. కూతుళ్ళు లేరు. కూతురు పుట్టాలని వేంకటాచలం వెళ్ళి స్వామిని వేడుకోగా, ఆయన అనుగ్రహం చేత కూతురు పుట్టగా ఆమెకు వేంగమాంబ అని పేరు పెట్టారు. ఆమె చిన్నతనం నుండి వేంకటేశ్వరస్వామి భజననే చేసేది. చిన్నపిల్లకి ఉపవాసాలు, భజనలు ఏమిటని పెళ్ళి చేశారు. పెళ్ళి చేయగా, ఆమె రజస్వల కాక ముందే భర్త మరణించాడు. భర్త మరణించినా ఆమె ఐదవతనానికి సంబంధించిన సూచనలను విడిచి పెట్టలేదు. బొట్టు, పువ్వులు పెట్టుకుని ఆంజనేయస్వామి గుళ్ళో హారతులిచ్చేది.

సంప్రదాయవాదులకు ఇది నచ్చేదికాదు. సౌభాగ్యం కోల్పోయి ఆలయానికి రావడం నచ్చక ఒకరోజు పుష్పగిరి పీఠాధిపతులు అక్కడికి రాగా, తరిగొండ వేంగమాంబను ఆయన వద్దకు తీసుకెళ్ళి, అయ్యా! ఈవిడ భర్త చనిపోయి నప్పటికీ పసుపుకుంకుమలతో, పువ్వులతో తిరుగుతున్నదని చెప్పారు.

ఆమె పళ్ళు పట్టుకెళ్ళి పుష్పగిరి పీఠాధిపతికి సమర్పించింది. అప్పుడు వారు వేంగమాంబా! సౌభాగ్యవతిగా సమాజంలో తిరుగుతున్నావట నిజమేనా? అని

> **పుష్పగిరి పీఠాధిపతులు**
> **వేంగమాంబ తపశ్శక్తిని గుర్తించి,**
> **ఈమె సామాన్యురాలు కాదు.**
> **అపారమైన ప్రజ్ఞావంతురాలని అన్నారు.**

అడగ్గా, అందులకు వేంగమాంబ అవును స్వామీ అని సమాధానమిచ్చింది. నీ భర్త మరణించాడు గదా అని అడగ్గా, నా భర్త వేంకటాధిపతి. నాది తరగని సౌభాగ్యమని సమాధానమిచ్చింది. అంతమాట అనడం చాలా గొప్ప విషయమే కానీ నేను పీఠాధిపతిని. నాకు నమస్కరించాలని తెలీదా? అని అడిగారు.

అందులకు ఆమె స్వామీ! నేను అలాగే మీకు నమస్కరిస్తాను కానీ మీరొక్కసారి ఆ పీఠంనుండి పైకి లేవమని అడిగింది. పీఠాధిపతి పైకి లేచారు. ఆమె పీఠానికి నమస్కరించగానే ఆ పీఠం అగ్నిహోత్రంలో భస్మమైపోయింది. పుష్పగిరి పీఠాధిపతులు వేంగమాంబ తపశ్శక్తిని గుర్తించి, ఈమె సామాన్యురాలు కాదు, అపారమైన ప్రజ్ఞాధురీణ. కాబట్టి ఈమెకి దేవాలయంలోనికి రావడానికి ఏ విధమైన అభ్యంతరాలు పెట్టకండి అన్నారు. అయినా, అర్చకులు ఆమెను దేవాలయంలోనికి వస్తున్నదని ఈడ్చేసారు. అర్చకులు ఆమెతో ఎందుకు ఈ గుళ్ళో ఉంటావు, వేరొకచోటికి పోకూడదా? అని అన్నారు.




భగవదాజ్ఞ అనుకుని అరణ్యమార్గం పట్టి తిరుమల వెళ్లింది. ప్రతిరోజూ స్వామి ఏకాంతసేవ జరిగిన తర్వాత వేంగమాంబ **ముత్యాలహారతి** ఇచ్చేది. ఇప్పటికీ వేంకటాద్రిలో ఆమె పేరుమీద **ముత్యాల హారతి** ఇస్తుంటారు. తులసీవనం ఏర్పాటు చెయ్యడానికి పాపవినాశనం వెళ్ళే మార్గంలో ఒక నుయ్యి తవ్వించేటపుడు పెద్దబండ పడగా ఆమె గంగమ్మని ప్రార్థించింది. బండ చిట్లిపోయి నీరు పైకి వచ్చింది. తులసీవనం పెంచి ప్రతిరోజూ ఆ తులసిని తెచ్చి వేంకటేశ్వరస్వామికి కైంకర్యం చేసేది. వంశపారంపర్యంగా వచ్చేవారు కాకుండా ప్రభుత్వం తరపున అధికారులైన అర్చకులు అక్కరామదీక్షితులనే ఆయనకి వేంగమాంబ మీద ఆగ్రహముండేది. సౌభాగ్యం కోల్పోయిన స్త్రీ రోజూ వచ్చి ముత్యాలహారతి ఇవ్వడమేమిటి? అని అక్కసుగా ఉండేది. ఆవిడ భోజనం చేసి కూర్చున్న తరువాత వారి ఇంట్లో భోజనం చేసిన ఎంగిలివిస్తళ్ళు తులసీవనంలో విసురుతుండేవారు.

కొంతకాలం గడిచాక దర్శనం చేసుకుని వచ్చి కూర్చున్న వేంగమాంబమీదకి ఎంగిలివిస్తళ్ళు విసిరారు. ఆమె సమాధి భగ్నమైంది. అందులకామె కోపించి ఈనాటితో నీ వంశం సరి, అందరూ నెత్తురు కక్కుకుని మరణిస్తారని శపించింది. ఉత్తరక్షణం ప్రధానార్చకునితో సహా కుటుంబంలోని వారందరూ నెత్తురు కక్కుకున్నారు. ఒక్కకొడుకు మాత్రం పాక్కుంటూ వచ్చి వేంగమాంబ పాదాలమీద పడ్డాడు. అప్పుడామె మీ వంశంలో ఒక్కడు మాత్రమే బతుకు

**ప్రతిరోజూ**
**శ్రీ వేంకటేశ్వరస్వామివారికి**
**ఏకాంతసేవ జరిగిన తర్వాత**
**వేంగమాంబ ముత్యాలహారతి ఇచ్చేది.**
**ఇప్పటికీ తిరుమలలో**
**ఆమె పేరుమీద**
**ముత్యాలహారతి**
**ఇవ్వబడుతోంది.**

తుంటాడని అభయమిచ్చింది. ఇప్పటికీ ప్రభుత్వం తరపున ప్రధానార్చకుల కుటుంబాల్లో ఒక్కడు మాత్రమే బతుకుతుంటాడు. ఆనాడు వేంగమాంబ ఇచ్చిన శాపం ఇప్పటికి కూడా తిరుమలలో పరిపాలన చేస్తున్నది.




కొండకెళ్ళి ఆమె వ్రాసిన వేంకటాచలవైభవం అన్న పుస్తకం తీసుకుని ఇంటిలో పారాయణం గావించగా, పెళ్ళికానిపిల్లలకి పెళ్లిళ్ళయ్యాయి. ఆమె దర్శనానికి వెళ్ళేవారి సంఖ్య ఎక్కువై ఆమె ఏకాంతం తగ్గిపోయి, ఆమె వేంకటేశ్వరుని ప్రార్థన చేయగా, దూరంగా తుంబురుకోనలోకి వెళ్ళి తపస్సు చేసుకో మని చెప్పాడు. ఆమె ఎల్లప్పుడూ అంతర్ముఖురాలై ఉండేది. రాత్రివేళ సొరంగపుమార్గంలో వచ్చి ఆనందనిలయం మూసే సిన తరువాత పీఠాన్ని పైకెత్తి స్వామి పాదాలవద్ద ఉన్న పువ్వులను తీసి కొత్త పుష్పాలతో పూజ చేసేది.

రోజూ పువ్వులు మారుతూండేవి. ఎవరు చేస్తు న్నారిదంతా అని అర్చకులకు అనుమానమొచ్చి, తిరుమల క్షేత్రాన్ని పాలించిన మహంతులలో ఒకరు, తలుపులు మూసిన తరువాత లోపలే కూర్చున్నారు. ఆ రాత్రివేళ తరిగొండ వేంగమాంబ దివ్యతేజో మూర్తియై ఫలకం తొలగించి లోపలికొచ్చి పూజ చెయ్యడం చూచి స్పృహతప్పి పడిపోయారు. ఆమె భాగవతం చెపుతుంటే వినడానికి స్వామి పవ ళింపుసేవ అయ్యాక వచ్చేవారు. స్వామి ఉయ్యాలలో కూర్చుని వింటూండేవారు. ఈమె భాగవతం చెప్తూండగా, తెల్లవారుజామున మూడు గంటలకి సుప్రభాతం జరిగే సమయానికి స్వామి ఉయ్యాల దిగి, నేను వెళ్లొస్తాను వేంగమాంబా! అని వెళుతుండేవారు.

ఒకరోజు మంచిఘట్టం చదువుతూన్న సమయంలో స్వామి బయలుదేరుతూండగా, స్వామీ! మీరు వెళ్లొద్దు. నా దగ్గరే ఉండుమన్నది. నీలాగే ఎందరో భక్తులు. వారిని కూడా చూడాలి కదా! బయలుదేరుతున్నానన్నారు స్వామి. మీరు అలా వెళ్ళిపోవడానికి వీలులేదని నిగ్రహిస్తున్న సమయంలో సుప్రభాతం వినబడింది. వేంకటేశ్వరస్వామి ఒక్క ఉదుటున ఉయ్యాలలో నుండి అంతర్ధానమైపోదామని అనుకుంటున్నంతలో ఆయన పట్టుపంచెని పట్టుకోగా, ఆ పంచె సగానికి చిరిగిపోయింది. స్వామి అంతర్ధానమై వెళ్ళిపోయారు.

అర్చకులు దేవాలయం తలుపులు తీసి **'కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే'** అంటూ సుప్ర భాతం చదివి లోపలకు వెళ్లగా, సగం చిరిగిన పట్టుపంచెతో కనిపించారు. ఇది దొంగతనంకాదు. ఎవరో భక్తులవలన జరిగింది. ఎవరై ఉంటారా అంటూ వేంగమాంబ ఇంట్లో చూడుమనగా అందరూ ఆమె ఇంటికెళ్ళారు. ఆమెని విచారించగా, స్వామిలేచి పారిపోతుండగా పట్టుకోగా సగం పంచె చిరిగి నా చేతిలో ఉండిపోయింది. మడతపెట్టి పూజా మందిరంలో పెట్టాను. తీసుకెళ్ళండి అన్నది ఆవిడ. లోపల పూజామందిరంలో ఉంది స్వామి పంచెలో సగభాగం. ఊరేగింపుగా తీసుకొని వస్తుంటే మిగిలిన సగభాగం అదృశ్యమై పోయింది. ఇవన్నీ యథార్థంగా జరిగాయి. ఆ తల్లి సమాధిలోకి వెళ్ళిపోయారు.

ఆదివరాహస్వామి వసతిసముదాయంవద్ద వెనుకగా చిన్నమార్గముంటుంది. ఆ మార్గంలో వెడితే తరిగొండ వేంగ మాంబ జూనియర్ కళాశాల అని ఓ పాఠశాల కనపడు తుంది. అక్కడ ఉంటుంది ఆమె సమాధి. అక్కడికెళ్లి ఆ సమాధికి సాష్టాంగనమస్కారం చేసి మౌనంగా ఒక్క నిమిషం కూర్చుని రావాలి. ఇప్పటికీ ఆమె శ్రీవేంకటేశ్వరస్వామికి అర్చన చేస్తూంటారని చెపుతారు.

పరమభాగవతోత్తములైన
శ్రీ అనంతాళ్వారు గురించి ఈ సంచికలో చదువవచ్చు.



05

# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

## అనంతాళ్వారు

ఒకప్పుడు వేంకటాచలంలో విషజీవులు కన్పిస్తుండంతో ఎవరూ ఉండేవారుకాదు. వేంకటేశ్వరుడు పుష్పాలంకార ప్రియుడు. రామానుజాచార్యులు తన శిష్యులను, ఎవరైనా వేంకటాచలంలో నివాసముండి, పుష్పవాటిక పెంచి, పూల మాలలు కట్టి, స్వామివారికి కైంకర్యం చేస్తారా? అని అడిగారు. వృద్ధుడైన అనంతాళ్వారులు లేచి, నేను వెడతానని అంటే వెళ్ళ మని అన్నారు. ఆయన పుష్పవాటికను ఏర్పాటు చెయ్యడానికి చెరువు తవ్వుతున్నారు. భార్య గర్భిణి. ఈయన మట్టి తవ్వి గంపలో పోస్తే ఆమె పట్టుకుని వెళ్ళలేక చెమటలు పోసి, అలసి పోయి నిలబడిపోతుండేది. ఈయన మళ్ళీ పిలుస్తుండేవాడు. ఇది చూచి, వేంకటేశ్వరస్వామికి బాధ కలిగి చిన్నపిల్లవాడి రూపంలో వచ్చి, అయ్యా! మీరు తవ్వి పోసిన బుట్ట నేను పట్టు కుని వెళతానని అన్నాడు. ఇద్దరం కైంకర్యమూ చేసుకుందామని వస్తే మధ్యలో నీవెవరు? పోతావా? పోవా? అన్నారు. కొడతా రేమో అని ఆ పిల్లవాడు వెళ్ళిపోయాడు.

అనంతాళ్వారుభార్య అతికష్టంమీద బుట్ట పట్టుకుని వెడు తున్నది. స్వామికి మనసాగక బయలుదేరి వచ్చి, అనంతా ళ్వారు వెనుక ఉండి ఆయన మట్టి బుట్టలో పొయ్యగానే పరుగుతో వెళ్ళి, మట్టి పోసేసి మళ్ళీ ఖాళీ బుట్ట అక్కడ పెట్టేవాడు. ఆళ్వారులు ఏమిటి? ఎంత ఓపికతో మా ఆవిడ ఎలా చేస్తున్న దని గునపం అక్కడ పెట్టి, వెనుకకు తిరిగి చూచారు. పిల్లవాడు కనపడ్డాడు. “నిన్ను పొమ్మన్నాను కదా! మళ్ళీ వచ్చావా?” అని గునపం పట్టుకుని ఒక్కదెబ్బ కొట్టబోయారు.




పిల్లవాడు పరిగెత్తాడు. వెనకనే గునపంతో ఈయనా పరుగుపెట్టారు. ఇప్పటి బ్రహ్మోత్సవాలలో స్వామి ఊరేగింపు జరిగే మాడవీధులలో ముందు వేంకటేశ్వరస్వామి, వెనుక అనంతాళ్వారుస్వామి పరిగెత్తారు. ప్రదక్షిణంగాను, అప్రదక్షిణం గాను, ఉత్తరంనుండి దక్షిణానికి, దక్షిణంనుండి ఉత్తరానికి పరిగెత్తారు. స్వామి ఆనందనిలయంలోకి పారిపోయారు ఆ పారి పోతున్నపుడు కోపం ఆపుకోలేక పిల్లవాడిమీదకి గునపం విసి రేసారు. అది వెళ్ళి, ఆ పిల్లవాడిగడ్డానికి తగిలింది.

సాయంకాలం పుష్పమాలలు కట్టుకుని అనంతాళ్వారులు ఆనందనిలయంలోకి వెళ్ళేసరికి గడ్డం వాచి, రక్తం పెచ్చుకట్టి వేంకటేశ్వరస్వామి కనపడ్డాడు. అర్చకులు హడలిపోయారు. ఇంత రక్తం కారిందేమిటి? అని. అప్పుడు వేంకటేశ్వరస్వామి మాట్లాడే వారు. “నా భక్తుడు గునపంతో కొట్టాడు. రాబోయే తరాలలో నా భక్తులు వచ్చి, నా గడ్డంమీద పచ్చబొట్టు చూచి, అనంతా ళ్వారు అనే భక్తుడు గునపంతో కొట్టిన దెబ్బ అని చెప్పు కుంటుంటే నేను విని మురిసిపోతాను. అందువల్ల నాకు ఇక్కడ



ఒక పచ్చకర్పూరపు బొట్టు పెట్టండి” అన్నాడు. శంఖనిధి, పద్మనిధి దాటి, లోపలకి వెడుతుంటే ఉత్తరపుగోడమీద పెట్టి ఉంటుంది- ఆ గునపం.

ఆ దెబ్బకు గుర్తుగా ప్రతి సం॥ బ్రహ్మోత్సవాలలో ధ్వజావ రోహణం జరిగిన మరునాడు, వేంకటేశ్వరస్వామికి బాగ్ సవారి ఉత్సవమని ఉత్సవం జరుగుతుంది. ఆ రోజు అనంతాళ్వారులు తరుముకుని వస్తుంటే ఎలా పరుగుపెట్టారో స్వామిపల్లకి ఆ రోజున అలా పరుగుపెడుతుంది. పల్లకి ప్రదక్షిణంగా తిరగాలి. కాని ఆ ఉత్సవంలో అలా తిరగదు. ఇప్పటికీ అనంతాళ్వారుల సమాధి ఉంది. ఆ సమాధిలో నుండి ఒక పొగడమాను పుట్టింది. ఇప్పుడు పెద్ద మఱ్ఱిచెట్టు పుట్టింది. అక్కడ హారతి ఇస్తారు.

అటూ ఇటూ పరుగు పెట్టి, అర్చకుడు ఆ కోనేట్లో స్నానానికి వెళతాడు. పల్లకిమాత్రం అప్రదక్షిణంగా పరుగెత్తు కుంటూ వచ్చి, ఆనందనిలయంలోకి వెళ్ళిపోతుంది. భక్తుల కోసం ఎంతో లొంగి ఉంటాడు. గునపం పట్టుకుని ఆయన తరుముతుంటే పరమాత్మ పరుగెత్తే ఉత్సవం ఎక్కడన్నా చూశామా? ఏడుకొండలలో చేస్తారు.

అనంతాళ్వారులు పుష్పవనం పెంచితే-శ్రీమహావిష్ణువైన వేంకటేశ్వరస్వామివారు రాత్రివేళ అమ్మవారితో విహరించడానికి వెళ్ళారు. కనపడ్డ పువ్వుల్లా కోసి, అమ్మవారితలలో పెడుతుండే వారు. ఇద్దరూ సంతోషంగా తిరుగుతుండేవారు. తెల్లవారి అనంతాళ్వారు వచ్చేటప్పటికి తోటలో ఒక్క పువ్వు కనపడేది కాదు. ఎవరో రాత్రివేళ పువ్వులు కోసుకుని పోతున్నారని శిష్యు లను కాపలా పెట్టాడు. దొరికేవారు కాదు. తానే కాపలా ఉండా లనుకుని కూర్చున్నారు. ఓ రాత్రివేళ లక్ష్మీదేవితో కలసి వచ్చారు-వేంకటేశ్వరస్వామి. పువ్వులన్నీ పుణికేస్తున్నారు. దొంగ దొరికాడు. ఎంతో అందంగా ఉన్నాడు కానీ ఇదేం బుద్ధి ఈయనకు? రాచకన్యలా ఉంది-భార్య! ఆ పిల్లను పట్టుకుని వచ్చి పువ్వులన్నీ పుణికేస్తున్నాడని, ఒక్క పరుగున వేంకటేశ్వర స్వామిని పట్టుకోబోయాడు. ఆయన దొరకుతాడా?

**చిక్కడు సిరి కౌగిటిలో**
**చిక్కడు సనకాది యోగిచిత్తాబ్జములన్**
**చిక్కడు శ్రుతిలతికావలి**
**చిక్కె నతడు లీలఁ దల్లిచేతన్ రోలన్.**

లక్ష్మీదేవికౌగిటిలో దొరకడు. సనకాదిమహర్షులకు దొర కడు. భక్తులకు దొరకడు. వేదాలకు చిక్కడు. ఉపనిషత్తులకు చిక్కడు. అనంతాళ్వారు పరిగెడితే దొరుకుతాడా? పారి పోయాడు. జగజ్జనని అదేమిటి అలా పారిపోతున్నాడాయన? అని ఆశ్చర్యపోతూంది. గభాలున వచ్చి, ఆయన అమ్మవారిని పట్టుకుని, అక్కడ ఒక చందనపు చెట్టు ఉంటే దానికి తన మీద ఉన్నఉత్తరీయం వేసి కట్టి, మీఆయన ఎవరు? ఎక్కడ ఉంటాడు? అని అడిగాడు. ఏం చెపుతుంది?

**పృథివ్యాం రాజసింహానాం ముఖ్యస్య విదితాత్మనః।**
**స్నుషా దశరథస్యాహం శత్రుసైన్యప్రతాపినః॥**
**దుహితా జనకస్యాహం వైదేహస్య మహాత్మనః**
**సీతా చ నామ నామ్నాహం భార్యా రామస్య ధీమతః**

**(సుందర-33వ సర్గలో)**

“నేను దశరథుని కోడల్ని, జనకుని కూతుర్ని, శ్రీరాముని భార్యను, నా పేరు సీత”- అని అమ్మవారు సుందరకాండలో చెప్పింది. స్వామి వామనమూర్తిగా వచ్చినపుడు అంటాడు.

**ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు? నొకచోటనక యెందు నుండ నేర్తు,**
**నెవ్వని వాడ నం చేమని పలుకుదు? నాయంత వాడనై నడవ నేర్తు,**
**నీ నడవడి యని యెట్లు వక్కాణింతు బూని ముప్పోకల బోవ నేర్తు,**
**నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ? నేరుపు లన్నియు నేన నేర్తు,**

నోరులు గారు నాకు నోరులకు నేనొదు
నొంటివాడ జుట్ట మొకడు లేడు
సిరియుఁ దొల్లిగలదు చెప్పెద నా టెంకి,
సుజనులందుఁ దఱచు సొచ్చియుందు.

ఆయన ఎప్పుడూ భక్తపరాధీనుష్ట. అంతటా ఉండేవాణ్ణి ఎక్కడుంటాడని చెప్పగలను? ఎంతమంది ఎన్ని సహస్రనామాలు పెట్టి పిలిచినా పలికేవాడు ఆయనే అంటుంది. చాలా గడుసుగా మాట్లాడుతున్నావమ్మా అంటాడాయన.ప్రహ్లాదుడు చెప్పాడు గదా!

ఇందు కల డందు లేడని
సందేహము వలదు చక్రి, సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
అందందే కలడు దానవాగ్రణి! వింటే

నీవు జాగ్రత్తగా చూస్తే ఆయన అంతటా ఉంటాడు – అన్నది. నీకోసం రాకుండా ఉంటాడా? ఎలా రాకుండా ఉంటాడో చూస్తానని అమ్మవారిపాదాలవద్ద పడుకొన్నాడు.

అనంతాళ్వారు ఎంత అదృష్టవంతుడో!

ఏ తల్లిపాదాలకు నమస్కరించి,

ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షఃస్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

ఏ తల్లి కంటికొనచూపుకోసం అనుక్షణం పరితపిస్తుంటారో,

క్షమస్వ భగవత్యంబ! క్షమాశీలే పరాత్పరే !
శుద్ధతత్త్వస్వరూపే చ కోపాదిపరివర్జితే !!

ఉపమే సత్త్వసాధ్వీనాం దేవీనాం దేవపూజితే !
త్వయావినా జగత్సర్వం, మృత్యుతుల్యం చ నిష్ఫలమ్ !

సర్వసంపత్ స్వరూపే త్వం సంతుష్టా సర్వరూపిణీ !
రామేశ్వ ర్యధిదేవీ త్వం, తత్కలాః సర్వయోషితః !!

కైలాసే పార్వతీ త్వం చ క్షీరోదే సింధుకన్యకా !
స్వర్గే చ స్వర్గలక్ష్మి స్త్వం మర్త్యలక్ష్మీ శ్చ భూతలే !!

వైకుంఠే చ మహాలక్ష్మీః దేవదేవి సరస్వతి!
గంగా చ తులసీ త్వం చ సావిత్రీ బ్రహ్మలోకగా!
కృపాప్రాణాధికాదేవీ గోలోకే రాధికా స్వయమ్।
రాసే రాసేశ్వరీ త్వం చ బృందా బృందావనే వనే !!

కృష్ణప్రియా త్వం భాండీరే, చంద్రా చందనకాననే !
విరజా చంపకవనే శతశృంగే చ సుందరీ !
పద్మావతీ పద్మవనే మాలతీ మాలతీవనే !
కుందదంతా కుందవనే సుశీలా కేతకీవనే !!

కదంబమాలా త్వం దేవి! కదంబకాననేఽపిచ !
రాజ్యలక్ష్మీః రాజగేహే గృహలక్ష్మీ ర్గృహే గృహే !!

ఇది ప్రతిరోజూ చెప్పుకోవలసినస్తోత్రం. చక్కనిభార్యని లభించడంకోసం అవివాహితులైన యువకులు, భార్య అను కూలవతిగా ఉండడానికి భర్తా, సంతానం కోరేవారు, పరమైశ్వర్యం పొందాలనుకునేవారు, నష్టధనాన్ని పొందగోరేవారు, కీర్తిని పొందాలనుకునేవారు, ఇంకా సకలశుభాలు పొందాలనుకునేవారు నిత్యం పఠించవలసింది.

అటువంటి అమ్మవారిపాదాలవద్ద పడకున్నాడు. తెల్లవారి ద్వారాలు తెరిచారు. స్వామివక్షఃస్థలంలో బంగారు లక్ష్మి లేదు. అర్చకులు హడిలిపోతే స్వామి చెప్పారు– "అనంతాళ్వారు రాత్రంతా లక్ష్మిదేవిని కట్టేశాడు. ఆయన్ను వేడుకుని అడిగి తీసుకుని రండి" అని చెప్పాడు. అర్చకులు వేదమంత్రాలతోటి, మంగళవాద్యాలతోటి వెళ్ళారు. ఏ తల్లి క్రీగంటిచూపులకు మహర్షులు వేచి ఉంటారో–ఆ తల్లిని తన ఉత్తరీయంతో కట్టి వాళ్లాయన వస్తాడని ఆమెపాదాలవద్ద కూర్చుని ఉన్నాడు. అనంతాళ్వారూ! ఎవరిని కట్టేశావో తెలుసా? సమస్త జగత్తును హేలగా ఆడించగలిగినవాడిభార్య– ఆవిడ.

అమ్మవారిని తీసుకుని రమ్మను అన్నారు. అప్పుడు "అయ్యో! తల్లి! నిన్ను కట్టేశానా? ఎంత అదృష్టవంతుణ్ణి" అని కూతురిని తీసుకుని వెళ్ళి, అల్లుడికి ఇచ్చినట్లుగా, ఒక బుట్ట తెచ్చి, తోటలోనిపువ్వులు అందులో వేసి "ఇందులో కూర్చో అమ్మా!" అని ఆ బుట్ట చేత్తో పట్టుకుని వగరుస్తూ వేంకటేశ్వరుని పాదాలవద్ద పెట్టారు. ఆ రోజున స్వామి "మామాగారూ! రండి," అని నోరువిప్పి మాట్లాడారు. నా భార్యను నీ కూతురుగా ఇంట్లో ప్రేమతో కట్టేసుకున్నావు. పూలబుట్టలో కూర్చోపెట్టి తీసుకుని వచ్చావు. మామగారివి కదా! చందనతాంబూలాలు స్వీకరించు" అని వేంకటాచలపతి గంధం రాసి, పుష్పమాలలువేసి, పట్టుబట్టలు పెట్టారు. స్వామిచేత మామా! అని పిలిపించుకున్న ఘనత అనంతాళ్వారుది. ఇప్పటికీ అనంతాళ్వారులసమాధి నైరృతిమూలలో ఉంది. అందుకే వాటికి 'ఏ.టి.జి.కాటేజెస్' అని పేరు.

**ఈ సంచికలో సన్నిధిగొల్ల, పద్మావతీ శ్రీనివాసుల అవతరణ వివరించబడుతుంది.**

అనంతాళ్వార్ తవ్విన చెరువు వైకుంఠం క్యూ కాంప్లెక్స్ పక్కన ఉంది. ఇప్పటికీ స్వామివారిసేవకు ఆ చెరువులో నీరు వాడు తుంటారు. అనంతాళ్వార్ ఎంతటి మహానుభావుడయ్యా అంటే స్వామి చెవి ఒగ్గి వింటారు. స్వామిని రావాలి అంటే ఆయన రారు. తిరుమల నంబీ అన్నా, అనంతాళ్వార్ అన్నా, వేంగమాంబా అంటే ఆయన పరిగెత్తుకుని వస్తారు. అటువంటి మహానుభావులపేర్లు వినపడుతున్నాయి - అని భార్యతోసహా వచ్చే స్తారు. శక్తిమంతమైన ఆరాధన చేసినవారు ప్రాతఃస్మరణీయులు.

## సన్నిధిగొల్ల

తరువాత చెప్పుకోదగినవారు సన్నిధిగొల్ల. తాను చేసింది లేకపోయినా వంశానుగతంగా ఆ వరం వచ్చేసింది. వేంకటేశ్వర స్వామికి యజ్ఞం చేశారు. కలియుగం వచ్చేస్తూంది- మమ్ములను మేము ఎలా రక్షించుకోవాలి? ఋషులందరూ సత్రయాగం చేసి, యజ్ఞఫలితం ఎవరికి ఇవ్వాలన్నారు.

**యజ్ఞ భృత్ యజ్ఞకృత్ యజ్ఞీ యజ్ఞభుక్ యజ్ఞసాధనః ।**
**యజ్ఞాన్తకృత్ యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ ॥**

యజ్ఞఫలితాన్ని పుచ్చుకునే సమర్థుడు విష్ణువే. ఎవరు సమర్థులో వారికి ఇవ్వాలి. నారదముని-భూలోకంలో వేంకటేశ్వ రావతారం రావాలి. అందుకని ఒక చిన్నవిషయం చూపించాడు.

వేంకటేశ్వరస్వామి భూలోకంలో అవతారస్వీకారం చేసి నప్పుడు యశోదాదేవి వకుళమాతగా నీ కల్యాణం చూడటం కొరకు పుట్టింది. ఆమెను నీతో తీసుకుని వెళ్ళమని వకుళమాతను వినియోగించారు. ఆమె దగ్గర ఉండి ప్రతిరోజూ వేంకటేశ్వర స్వామియోగక్షేమాలు చూస్తుండేవారు. కల్యాణం చేసుకోవలసిన సమయం ఆసన్నమైంది.

ఆకాశరాజు యజ్ఞం చెయ్యడానికి భూమిని దున్నుతున్నారు. సీతమ్మతల్లి జన్మించినట్లుగానే నాగేటిచాలులో మందసం దొరి కింది. ఆ మందసం మూత తెరిచారు. పద్మాలలో పడుకుని అమ్మ వారు కనపడింది. పద్మాలలో దొరికింది కనక పద్మావతి అని పిలి చారు. అయోనిజగా జన్మించిన అమ్మవారిని ఎవరికిచ్చి వివాహం చెయ్యాలా? అని ఆకాశరాజు మథనపడుతున్నాడు.

శ్రీనివాసుడు వాయుదేవుణ్ణి గుర్రంగా చేసుకుని, వేటకోస మని విహారంగా వచ్చాడు. వేటాడుతూ ఉండగా, అదే సమయానికి పద్మావతి చెలికత్తెలతో వనవిహారానికి వచ్చింది. ఒక ఏనుగు ఆమెను, చెలికత్తెలను తరిమింది. ఆ తరువాత ఎటో మాయమై




# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

పోయింది. వేంకటేశ్వరస్వామిదర్శనం పద్మావతికి, పద్మావతీదేవి దర్శనం స్వామికి జరిగింది. ఆమె తన్మయావస్థలో ఉండగా చెలి కత్తెలు వచ్చి, "ఎంతటి తెంపరివాడివి? ఉద్యానవనంలో రాజ కుమార్తెదర్శనానికి వచ్చి, తేరిపార చూస్తున్నావా?" అని చెప్పి రాళ్ళు పెట్టి కొట్టారు. అవి గుర్రానికీ, ఆయనకూ ఇద్దరికీ తగి లాయి. భక్తులకోసం రాళ్ల దెబ్బలు తిని, కింద పడిపోయినప్పుడు ఎలా ఉన్నాడో పురాణంలో చెప్పారు.

**యథా యుగాంతే వటపత్రశాయీ**

యుగాంతం అయ్యాక వటపత్రశాయి ఎలా పడుకున్నాడో అలా పడుకున్నాడు. అప్పుడు పద్మావతి చెలికత్తెలు "నువ్వెందుకు వచ్చావు?" అని అడిగారు.

**కన్యాపేక్షా ముఖ్యకార్యమ్**

అని వివాహం చేసుకోవడానికి ఆడపిల్లకొరకు వచ్చా నన్నారు. చెలికత్తెలు "ఎంత సాహసపూరితంగా మాటలు మాట్లాడు తున్నావో తెలుసా? ఆకాశరాజుకు తెలిస్తే నిన్ను ఉరి తీస్తారు?" అన్నారు. "వచ్చిన పని అయిపోతే మరణం వచ్చినా ఫరవాలేద న్నారు"-ఆయన.



**కార్యాంతే మరణం శ్రేయః**

అలాగే సంహరించబడతాను. నాకేమీ బెంగ లేదన్నారు. కావలసిన అవతారప్రయోజనం-స్వామిమనసు అమ్మవారి వద్దకూ, అమ్మవారిమనసు స్వామివద్దకూ మారాయి. తేనె, అవీ పట్టుకుని ఇంటికి వెళ్ళినా చాలా చిన్నబుచ్చుకుని కూర్చున్నారు. ఆదివరాహ స్వామి వకుళమాతకు "సాక్షాత్తుగా నీవు పెంచి పెద్ద చేసిన కృష్ణమూర్తి ఈ రోజు ఈ రూపంలో వేంకటేశ్వరుడుగా వచ్చారు" అని చెప్పారు. అమ్మ చూచి ఎందుకలా ఉన్నావని అడిగింది.

**ఉత్తిష్ఠోత్తిష్ఠ దేవేశ కిం శేషే పురుషోత్తమ!**

ఆయన లేచి ఏమి జరిగిందో చెప్పమని అడిగిన తల్లికి "అమ్మా! ఏం చెప్పమంటావు? పద్మావతీదేవివద్ద మనసు పడవేసు కున్నాను. ఆమెతో వివాహం జరగాలని కోరిక" అని చెప్పారు. అయ్యో! వారు రాజులు మనకు పిల్లను ఇస్తారా! అనింది. అమ్మా! నా అవతారప్రయోజనాలలో అది ఒక కారణం. ఆమె పుట్టిందే నా కోసం. నువ్వు వెళ్ళి పిల్లను అడగమని అన్నారు. పద్మావతికూడా మనసుపడి అన్నం నీళ్ళు మానివేసింది. హంసతూలికాతల్పంమీద పడుకుని చెలికత్తెలు వింజామరలు వీస్తున్నా, అగ్నిసెగ తగిలినంత బాధ పడిపోతున్నది. చెలికత్తెలు "ఏమిటమ్మా ఇలా అయిపోయా" వంటే ఆమె చెప్పింది.

**విరికై తుమ్మెద లీల నా హృదయ మువ్విళ్ళూరు నెల్లప్పుడున్**
**హరికై సత్కరుణాసుధాలహరికై ఆనందమందాకినీ**
**ఝరికై నిత్యనివాసశేషగిరికై సంధృప్త దైత్యేభ కే**
**సరికై నిర్మల మందహాస సుషమాసౌభాగ్య సంచారికై**

అని పద్మావతీదేవి వేంకటేశ్వరస్వామిలో మనసు లగ్నమైం దని చెప్పింది. ఏ యుగంలో అయినా, ఎన్ని అవతారాలెత్తినా ఆయనకొరకే అని రుక్మిణీదేవి చెప్పినట్లు-

నాకు వేంకటేశ్వరుడే భర్త అని భీష్మించుకుని కూర్చున్నది. వకుళమాతతో వేంకటేశ్వరస్వామి వేంకటాచలం కిందకి దిగితే, కూతురికోరిక తీరడంకోసమని అగస్త్యమహర్షివారి ఆశ్రమంలో ఉన్న పరమశివలింగానికి సహస్రఘటాభిషేకం చేయిస్తున్నారు. ఆకాశరాజపరివారమంతా అక్కడుంది" వెళ్ళి వారితో పిల్లను ఇచ్చి పెళ్ళి చేయమని అడగమని అంటే ఆమె అక్కడకు వచ్చి అడిగితే తప్పకుండా అంతఃపురానికి వెళ్ళి మాట్లాడుకుందామని చెలికత్తెలు చెప్పి, తీసుకుని వెడుతున్నారు. ఇంతలో వేంకటేశ్వరస్వామి ఏ అవతారంలో ఎవరూ వేయని సోది చెప్పే ఎరుకలదానిలా చిత్రమైన వేషం వేశారు. ఒకప్పుడు ఆయన్ను ఆ ఉద్యానవనంలో చూచి ఆశ్చర్యపోయి

**ఎటుల వచ్చితి విచ్చటి కెవర వీవు? పరమ రమణీయ ఫలపుష్ప ఫలితమైన ఈ విశాల వనమునందు తావు లేదు జంతువులపట్టులిచట నిషాదులకును**

అని వేటగాడు అనుకుని వెళ్లగొట్టేశారు.

సోది చెప్పే వ్యక్తిలా ఇప్పుడు వచ్చి ధరణీదేవిఅంతఃపురం దగ్గరలో సోది చెపుతానని అంటుంటే, వీథులలో నిలబడి చక్కగా సోది చెపుతున్నారు. జరిగే విషయాలు, జరగబోయే విషయాలు ఎంత బాగా చెపుతున్నదో సోది అనే వార్త ధరణీదేవికి వెళ్ళింది. ఎంతో అందమైనవేషం కట్టారు.

"తెల్పు నల్పగు వెంట్రుకల్ తెల్పు తలపైన అలరారు తాటాకు బుట్ట. ప్రాయంబు సడలిన పచ్చచెక్కిళ్ళపై సొంపు నింపెడి సోయగంపు సొట్ట. తమ్మిమొగ్గల నెల్ల దాచెడి మెత్తటి పైట చక్కగా నింపు పూసల సరుల పుట్ట, గజకుంభముల మించు నిజ బుఱ్ఱ సొర్రపై తియ్యటి పాట పుట్ట, కలికి నెలవంక కుంకుమ చిలువ పుట్ట, బ్రహ్మ వొడిలోన బాలుడై రవము పెట్ట, మంచి ఎరుకత వచ్చె సిరి మించునట్లు"



తెల్లగా నల్లగా అయిన తలమీద చక్కని తాటాకు బుట్ట పెట్టుకున్నది. చేతిలో వాయిస్తూ పాడటానికి పెద్ద సొరకాయతో చేసిన బుర్రపట్టుకుని, పెద్దకుంకుమబొట్టు పెట్టుకుని బ్రహ్మదేవుని పిల్లవాడిని చేసుకుని ఒళ్ళో పడుకోబెట్టుకుని, సోది చెపుతానని తిరుగుతుంటే, లోపలకు తీసుకుని వెళ్ళారు. 'ఏమ్మా సోది చెప్పు'! అని అడిగారు. చెపుతాను కానీ అమ్మా! పిల్లవాడు మారాం చేస్తు న్నాడు. కొంచెం పాలు బువ్వ పెట్టమని అడిగింది. భగవానుడు ఏదైనా ఫలితమిచ్చే ముందు ఒక చిన్న పుణ్యకార్యం చేయిస్తాడు.

(

**శ్రీ శైలేశు భజింతునో యభవుఁ గాంచీనాథు సేవింతునో**
**కాశీవల్లభుఁ గొల్వ బోదునొ మహాకాళేశుఁ బూజింతునో**
**నాశీలం బణువైన మేరు వనుచున్ రక్షింపవే నీకృపా**
**శ్రీశృంగారవిలాసహాసములచే శ్రీకాళహస్తీశ్వరా!**

శ్రీకాళహస్తీశ్వరశతకంలో ధూర్జటి నేనేం చెయ్యగలను స్వామీ? ఇంత చేయించిన నువ్వే అంతా చేసి, నన్ను రక్షించు అంటాడు.

అమ్మా, పిల్లవాడికి అన్నం పెట్టు అన్నారు. పాలలో అన్నం కలిపి, అందులో బెల్లం కలిపి, చెలికత్తెలు పెడితే ఆ పిల్లవాడు తినక మారాం చేసి ఏడుస్తుంటే స్వామి పిల్లవాడిని తీసుకుని ఒళ్ళో పెట్టుకుని, వీడికి ఒక దుర్బుద్ధి ఉంది.

ఈ పిల్లవాడు నేను తింటే నా కడుపులో నుండి తింటాడు గాని తిన్నగా తినడు - ఎంత విచిత్రమంటే బ్రహ్మ ఆయన కడుపులో నుండి నాభికమలంలో నుండి పుట్టినవాడు. స్వామి తిన్నదాని నుండి నాభికమలంనుండి బ్రహ్మగారు స్వీకరించాలి - అందుకని ఆ పాలు అన్నం నాకివ్వండి నేను తింటానని తిని తాంబూలమివ్వమని చక్కగా తాంబూలమడిగి పుచ్చుకుని, తాంబూలం వేసుకుని, ఎర్రటి నోటితో పెదవి జారెడు చక్కటి జెలువ బుట్ట ఇత్తడిసరులబుట్ట సోది చెప్పేవాళ్ళు పెట్టుకున్నట్లుగా చిన్న ఇత్తడి చుట్ట పెట్టుకుని, ఒక చేత తీసుకుని రమ్మన్నారు.

అందులో బియ్యం బదులు ముత్యాలు పోశారు. ఆ ముత్యాలు చేతితో తీసి పిసికి మూడురాశులు పోసి, మధ్యరాశిలో మనసు పెట్టి, ఆ మూడు రాశులలోని మధ్యరాశి మీద మనసు పెట్టి, నీ మనసు దేనిమీద నిలబడిందని ధరణీదేవిని అడిగింది.

ధరణీదేవి నా మనసుకూడా మధ్యదాని యందే నిలబడిందని చెప్పింది. ఇద్దరిమనసులు కలిశాయి. అందుచేత నా నోటివెంట పలికేమాట నిజమై తీరుతుంది. చెప్పిన సోదిప్రకారం నడచుకో అంటే, ఏం చెయ్యమంటావు అని అడిగింది ధరణీదేవి.




# తిరుమల విశిష్టత

- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

శ్రియఃపతిగా నెలకొన్నవోడా, శ్రీమహాలక్ష్మిని చేకొన్నవోడా, వేదాలు బ్రహ్మన్న కిచ్చిన్నవోడా, మరుగుజ్జు రూపాన నెలకొన్న వోడా, గొడ్డలిని చేపట్టి కాపాడినోడా నల్లనీ తెల్లనీ చక్కన్నివోడా, బదరి నారాయుడా, బంధ మోక్షకుడా, శ్రీమహావిష్ణువా నా నాల్కపై నిల్చి నిజము చెప్పించు. కంచి కామాక్షి, కాశీ విశాలాక్షి, కనకదుర్గమ్మ, కాళహస్తి జ్ఞానప్రసూనమ్మ, పలుకీయరే నాకు మంచి పలుకీయరే. నా నోట నిజమును పలికించరే తల్లి పలికించరే. అని సోది చెప్పటం మొదలుపెట్టింది.

ఇదిగిదిగో చెపుతున్నా అదిగదిగో చెపుతున్నా ఓయమ్మ గడ్డం చూపించానంటే బుర్రోడనుకో ఎడమచెవి చూపానంటే బుర్రిదే అనుకో. నీ సమస్య అంతా ఎడమ చెవితో వచ్చిందే తల్లి. నీ బుర్రిది కొద్ది కాలంనుండి నిద్రాహారాలు మానిందే అమ్మ. అది గాలి కాదు, ధూళి కాదు, భూతం, ప్రేతం, పిశాచం ఏదీకాదు. బొల్లి గద్దనెక్కి







తిరిగే నల్లనయ్య, మూడు నామాలవాడి మీద మనసు పారవేసుకున్నదే తల్లి. వాడు సర్వలోకాలకు రక్షకుడే అమ్మ. నీ కూతురు కారణజన్మురాలే తల్లి. నీ కూతురిని ఆ నల్లనయ్యకి ఇచ్చి పెళ్లిచెయ్యవే తల్లి అన్నది. ధరణీదేవి నీవు చెప్పినట్లు చెయ్యకపోతే ఏమవుతుందని అడిగింది. నేను చెప్పినమాట వినకుంటే పెద్ద కీడే జరుగుతుంది. నీ కూతురు పుట్టిందే వాడిని చేపట్టటానికి తల్లి. నాకు ఆగ్రహం తెప్పించకే అమ్మ. కొద్దిసేపట్లో ఒక ముసలమ్మ ఈ మాట అడగడానికి వస్తుందే అమ్మ. నా మాట నిజమౌతుందే తల్లి. నా మాట విని నీ పిల్లని ఆ పిల్లవాడికి ఇచ్చి పెళ్ళిచెయ్యి. శాశ్వతమైన కీర్తి పొందుతావే అమ్మ. ఇది కనకదుర్గమ్మ మాటే అనుకో అని సోది చెప్పింది. వేంకటేశ్వరస్వామి సోది చెప్పటమేమిటి? ధరణీదేవి పొంగిపోయి పెద్ద కానుక ఇచ్చి చీరా సారే పెట్టింది. అన్నీ పుచ్చుకుని స్వామి ఏమీ తెలియని వాడిలా వెళ్ళిపోయాడు.

ఆ వెనకాతలే వకుళమాత వచ్చి మా కుమారుడైన వేంకటేశ్వరస్వామికి మీ అమ్మాయి పద్మావతీదేవిని ఇచ్చి వివాహం చెయ్యవలసిందని అడిగింది. పద్మావతీదేవిని అడిగితే 'నా, తపస్సే అది నాకు వేంకటేశ్వరస్వామిని ఇచ్చి వివాహం చెయ్యమని' అన్నది.

శుకబ్రహ్మతో శుభలేఖ వ్రాయించిపంపించారు. వేంకటేశ్వరస్వామి అంగీకరించారు. తన ఇద్దరు అనుచరులలో ఒకరైన శేషుని పిలిచి కైలాసానికి వెళ్ళి పరమశివుని పరివారమంతటినీ పెళ్ళికి పిలుచుకుని రమ్మని అన్నారు. రెండవవాడైన గరుత్మంతుని పిలిచి సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మ, మొదలగువారందరినీ పిలుచుకుని రమ్మని అన్నారు.

మహర్షులు, ఋషులు, కిన్నరులు, కింపురుషులు, సమస్త లోకాలలోని వాళ్ళందరూ బయలుదేరి వచ్చేశారు. వచ్చిన వాళ్ళతో ఏడుకొండలు నిండిపోయాయి. అందరూ వచ్చి పెళ్ళికొడుకుని చేశారు. పక్కన లక్ష్మీదేవి ఒక్కతె లేదు. కొల్హాపురిలో ఉండిపోయిందని స్వామికి బాధ కలిగి, సూర్యుని పిలిచి లక్ష్మిని తీసుకుని రమ్మని అన్నారు. ఆయన పెళ్ళి అని చెప్పి తీసుకుని రమ్మని అంటారా? అని అడిగాడు. పెళ్ళి అని చెపితే రాదు. ఒక యుక్తి చెపుతాను, వేంకటేశ్వరస్వామి నేలమీద పడి లక్ష్మీ లక్ష్మీ అంటూ స్పృహతప్పి పడిపోయారని చెప్తే ఏమీ అడగదు.

వెంటనే రథమెక్కి వచ్చేస్తుందన్నారు. ఆయన, కరవీరపురం వెళ్ళి అలాగే చెప్పారు. కలియుగం ప్రారంభం దాని లక్షణం. అలిగి వెళ్ళిపోయిన పెళ్ళాన్ని తీసుకుని రావడానికి ప్లాను ఏమిటో మొదట ఉపదేశం చేసిన పరమ గురువు ఆయనే. కోపం వచ్చి వెళ్ళిపోయినా భర్త అలా పడిపోయాడనేటప్పటికి రథమెక్కి ఆవిడ వచ్చింది.

వెంటనే లేచి కూర్చుని లక్ష్మీ, నీవు లేకుండా పెళ్ళేమిటని ఇలా పడిపోయాను అన్నారు. బ్రహ్మ యాజ్ఞీకం చెయ్యడానికి వచ్చి ఏమీ అనుకోవద్దు నాన్నగారూ, మీకు ఒక రహస్యం చెబుతాను అని పెళ్ళి చేసుకునేవాడు ఇంటికి వచ్చిన బంధువులకు ఇక్కడ భోజనం పెట్టడం మాని ఆడ పెళ్ళివారింట్లో భోజనాలు పెట్టిస్తానని అనకూడదు. ముందు ఇక్కడ భోజనాలకు ఏర్పాటు చెయ్యమని అన్నారు.

నాయనా, నిన్ను పిలిచినందుకు గొప్ప సలహా చెప్పావు. భార్య లక్ష్మీదేవి కోపం వచ్చి వెళ్ళిపోయింది. కింద పడిపోయానంటే వచ్చింది. డబ్బు అడిగితే కోపం వస్తుంది. ఇప్పుడు డబ్బులు ఎక్కడ నుంచి తీసుకుని రమ్మని అంటావు అన్నారు. పరమశివుడు వచ్చి మీరేమైనా చెప్పండి కానీ ఇలాంటి పెళ్ళిళ్ళు చేసుకోకూడదు అన్నాడు. అందరికీ భోజనాలు పెట్టి, కులదేవతారాధన చేసి అప్పుడు బయలుదేరాలన్నాడు.



